

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# సీతానాథశతకము




గ్రంథకర్త:

నరహరి గోపాలాచార్యులు,

తమ్మర, నైజాం.

# పీ ఠి క

ఈ గ్రంథరచనకుఁ బూర్వమున "ప్రణతి" యను పేరుతో శ్రీవిష్ణుపాదుకాస్తోత్రము వ్రాయుచుండఁగా మధ్య కాలమున నొకనాఁటి యుదయమునం దర్శనానంతరమున స్వామిని సేవించునప్పు డప్రయత్నముగా నీ శతకమునఁ గల (౧౬)వ పద్య మాశువుగా వెలువడినది. అదియే మఱువాఁడు నేను 'జదువుచుండఁగా నాతమ్ముఁడు యోగానందాచార్యులును బావమఱఁదులు పరాంకుశం కృష్ణమాచార్యులును, లక్ష్మీనరసింహాచార్యులును విని, యిటులే యొకశతకము వ్రాయుమని యుత్సాహ మొసఁగిరి. అది యేమి స్వామిసంకల్పమో గాని మొదటఁ బ్రారంభించిన "ప్రణతి" యను గ్రంథమందు నొకపద్యమైన సాగినదికాదు. ఈ గ్రంథము మాత్రము '౨౦' దినములలోఁ బూర్తి జెందెను దీనిని నాకు బాల్య స్నేహితులు, మ॥ రా॥ శ్రీ నాప్రరాజు సీతారామచంద్రరావు గారును, "వెన్నవరం" గ్రామవాస్తవ్యులగు, మ॥ రా॥ శ్రీ రావులపాటి సీతారామచంద్రరావుగారును, విని యామోదించి, ముద్రణమున కత్యంతప్రోత్సాహకులైరి. సద్గురువర్యులు, శతావధాని, సంపన్మంబ సింగరాచార్యులుగారు పరిష్కరించిరి. ముద్రణ ద్రవ్యదాతలకును, ప్రోత్సాహకులకును, సర్వశ్రేయంబుల నొసంగి రక్షించుటకుఁ గృతిభర్తయగు శ్రీ రామచంద్రస్వామివారికి సాష్టాంగప్రణామము లర్పించుచున్నాఁడను.

ప్రమాథి సం॥ అధిక శ్రావణ,
శుద్ధ 3 బుధవారం,
ది 19—7—1939.

ఇట్లు విధేయుఁడు,
గ్రంథకర్త

శ్రీః.

శ్రీరామాయ నమః — శ్రీమతే విఖనసే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ సీతాసనాథ శతకము

సీ॥ శ్రీరామ! నీపాదసేవకై గోరెదఁ
జిత్తవృత్తిని గల్గఁ జేయుమయ్య
నీకుఁ బ్రదక్షిణానీకముల్ జేయంగఁ
గాళులకును బనిఁ గరపుమయ్య
మమత నీగేహసమ్మార్జనం బొనరింపఁ
జేతులకును పనిఁ జెప్పుమయ్య
భవదీయనామంబుఁ బ్రీత్యహమ్ము స్మరింప
జిహ్వకుఁ బని దయసేయు మయ్య

గీ॥ త్వత్పదాశ్రయులకు భక్తిఁ బ్రణతి సల్పు
కార్య మిడి దేహమునకు నన్ గావుమయ్య
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧

సీ॥ శతశతానంతవత్సరములు నిశివిగాఁ
జింతించి చింతించి సంతతంబుఁ
దత్త్వనిర్ధారణార్థరహస్యములనెల్ల
స్థిరతరమనసంబుఁ జేసి చేసి
యే మహామహుమహిమామృతసింధు శీ
కరపరమాణువుఁ గాంచలేక
బ్రహ్మరుద్రాదిదేవతలెల్ల వివశులై
రట్టి నిన్ వినుతింప నాత్మఁ దలఁచి,
గీ॥ పద్దెముల నల్లుటకు నాసపడెద నెంత
సిగ్గుమాలినవాఁడరా శ్రీనివాస !
హతవిరాధ! విధూతసర్వాపరాధ !
తమ్మరఘురాధినాథ! సీతాసనాథ !

సీ॥ అతికష్టముననైన మతికొలందిగనైనఁ
జాలదు శక్తి నిన్ సన్నుతింప
నటులయ్యు నుతియింతు ననవరతము సర్వ
దేవతలును బ్రహ్మదేవుఁ డభవుఁ
డాగమములు స్తోత్ర మాచరించుటలేదె?
తులఁజెందితిని నాఁటతోడ నేను
గంగజేరిన యట్టి కల్మషోదకనిర్మ
లోదకములు సామ్య మొందు టరుదె?
గీ॥ అబ్ధిలో మున్గు గిరి పర-మాణువులకుఁ
దారతమ్యంబు గల్గునే! తలచిచూడ ?
హతవిరాధ! విధూతసర్వాపరాధ
తమ్మరఘురాధినాథ! సీతాసనాథ!

సీ॥ నా మనంబునకు నీ నవ్యసౌందర్యలా
వణ్యంబు సేవించు భాగ్య మిమ్ము
నా నాసికకు నీదు మానితపాదాబ్జ
తులసి నాఘ్రాణించు కలిమి నిమ్ము
నా శిరంబునకు శ్రీనాథ! నీ పాదుకల్
పూని వహించెడు భోగ మిమ్ము
నా చెవులకు నెప్డు నీచరిత్రంబు లే
' విని సంతసించెడు వేడ్క నిమ్ము
గీ॥ త్వద్గుణానుభవానందవసధి పొంగి
పొరలి కన్నుల జాల్వారు పుణ్య మిమ్ము
హతవిరాధ!విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ!సీతాసనాథ! ౮

సీ॥ నీవాడ ననుచు దా నేవాఁడయిన నొక్క
పరి చేరి మ్రొక్కినఁ గరుణతోడఁ
గాపాడ వ్రతమును గైకొనియున్నాఁడ
నే మాఱు మాటాడ నేర నంచు
నొప్పారు నీదు యథోక్తకారిత్వము
నలవిభీషణు డాదిగల మహాత్ము
లంద తెలుపుదు రట్టి నీ వ్రతము దు
ర్జనశేఖరుఁ డటంచు జడుని నన్ను
గీ॥ నేలక యుపేక్ష యొనరించు నే? తలంప
తానుగాఁ దాని పాలింపఁ బూనఁగాక
హతవిరాధ!విధూతసర్వాపరాధ
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౯

సీ॥ నిత్య మనాదిగా నిఖలపాపగ్రాహ
సంకులసంసారజలధియందు
దుఃఖవీచికలలో దొర్లుచుండుట నాకు
సహజంబ యగుట విచారపడను
జనక! నిర్హేతుక జాయమానకటాక్ష
వీక్షణామృతముచే వెలయు నీదు
పాదసన్నిధిలోనఁ బ్రణతిఁ జేసియుఁ బరా
భవము నొందుదు రేని భక్తవరులు
గీ॥ నీకు ననురూపకృత్యమై నెగడ దనుచుఁ
జేతులు మోడ్చి విజ్ఞప్తి సేయుచుంటి
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౬

సీ॥ ఇఁక నన్ను రక్షింప నీక్షింపరా! యంచు
నే బతిమాలంగ నేల? రామ?
నీవు కృపాదృష్టి నెరపకయున్న నీ
సకలజగత్సృష్టి జరుగ దనిన
నిలిచి ప్రవర్తింప నేర్చునే? నైసర్గి
కముగ సుహృత్తువై గ్రాలునీకు
నాశ్రితసంరక్షణానల్ప మగుదీక్ష
యమరుట యొకవిచిత్రమును గాదు
గీ॥ అమితవాత్సల్యకూపార! యఘవిదార!
సూరిసంచయ మందార! శుభవిచార!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౭

సీ॥ శ్రీరమానాథ! యాశ్రితదీనమందార!
భక్తవత్సల! దయాపర! ముకుంద!
భవభయదూర! శ్రీవైకుంఠ! పురుషోత్త
మా! వాసుదేవ! తామరసనేత్ర!
కృష్ణ! హృషీకేశ! కేశవ! పరమాత్మ!
యచ్యుత! గోవింద! యభవ! విష్ణు!
రంగేశ! యని మఱి రంజిల నీనామ
ములు నాదువాక్కుల నలరునట్లు
గీ॥ నీ వనుగ్రహ మ్ముంచిన దేవదేవ!
దాపుఁజేరునె? యా దండధరుఁడు గిరుఁడు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౮

సీ॥ ఎన్నికల్పములు మున్నేను స్థావరమునై
పడియుంటినో భూమిభరముగాఁగ
తృణగుల్మములయందుఁ దెరపిగాంచక యెన్ని
జన్మలఁ గంటినో జగతియందు
అండజమ్ములయందు ననవరతమ్మును
బుట్టిగిట్టితినో? యీ భూమి మీఁద
పశుదేహముల నెన్ని పనివడి ధరియించి
చరియించినాఁడనో ధరణియందు
గీ॥ రామ! నేఁటికి నీ కృప రాఁగ నరుఁడ
నైతి నిఁక నన్నుఁ జేపిడకయ్య! దేవ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౯

సీ॥ రాలు రప్పలు నొచ్చుఁ జాలఁగా భూమిపై
నేఁడుచు వేళ నక పీడలేదు
చెట్లు చేమలు నొచ్చు గట్లసందునఁ బుట్టి
గోముఁ జెందెదు వేళ పీడలేదు
నల్లిగా బల్లిగా నల్లాడు చిమములఁ
బడెడు వేళలనైన విడువలేదు
అజమునై గజమునై యావునై మావునై
విలపించు వేళఁ జేపీడలేదు
గీ॥ ఇప్పుడు న్నెంటసంటి స న్నేలుచుంటి
నైన నిగ్గనలేనైతినయ్య! రామ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౮

సీ॥ నేను ద్రావిన జననీస్తన్యజలధుల
లెక్క బ్రహ్మకునైనఁ జిక్కఁబోదు
నే నొనర్చినయట్టి నిఖిలపాపపు రాసు
లా కులనగములనైన మించు
నేను దాల్చిన జన్మనివహంబు లిలఁ గల
పరమాణువులసంఖ్యఁ బరిహసించు
నేను జేసిన మహానీచకృత్యంబులు
చిత్రగుప్తుఁడు జమఁ జేయలేఁడు
గీ॥ ఇంతటి మహాపచారుండ! నిందిరేశ!
నీకృపాగుణ మెట్లు నన్ సాకఁగలదొ?
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧

సీ॥ హారకిరీటకేయూరకంకణకట
కాంగుళీయక భూషణాళి వెలుఁగ
సవ్యపార్శ్వంబున జానకి దక్షిణ
భాగంబున సుమిత్రపట్టి గొల్వఁ
బాదపద్మమునొద్దఁ బవనాత్మజుఁడు గేలు
దోయి మొగిడ్చి సంస్తుతు లొనర్ప
ససమానదివ్యశరాసనముక్త హాను
హస్తాలంబున సందమొప్ప
గీ॥ సభయముద్రయుఁ గుడికేల సమరుచుండ
నీవు నాహృదయంబున నిలువుమయ్య!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౨

సీ॥ నామనోబ్జమునందు నీమ్మనుపాదార
విందముల్ సంతతప్రేమ నిల్పి
భక్తిభావంబునఁ బ్రీతినిమేషంబును
గర మొప్ప గద్గదస్వరముతోడ
నిరుపమానగుణాబ్ధి! నిర్మలభవ్యది
వ్యస్వరూపా! భవ బంధహరణ!
నారాయణా! కరుణాకర! యని బాష్ప
రుద్ధనేత్రములతో శుద్ధమతిని
గీ॥ గీర్తన మొనర్చు భాగ్యంబుఁ గృప నొసంగు
మయ్య! రామయ్య! ననుబ్రోవుమయ్య సతము
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౩

సీ॥ దీనరక్షణమందు దీక్షఁ బూనితి వౌట
దీనుఁడ నన్ బ్రోచితీరవలయు
దాసపోషణమందుఁ దాల్చితి బిరు దౌట
దాసునన్ బ్రోవగాఁదలఁప వలయు
భక్తపాలకుఁ డంచుఁ బ్రథవహించితి వౌట
నీమూఢభక్తుని నేలవలయు
కృపణపాలకుఁ డంచుఁ గీర్తిగాంచితి వౌటఁ
గృపణుని నన్ గావ నెంచవలయు
గీ॥ దిక్కుమాలిన నాకీవె దిక్కుగమ్మ
బక్కబంటుగనైన నన్ బట్టుకొమ్ము
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౪

సీ॥ దేహబాంధవులపైఁ దీరనిప్రేమ యన్
వలలోఁ దగుల్కొని వనరుకతన
సంసారహేతువై సాగు సతీసుత
మోహమన్ జలధిలో మునుఁగుకతనఁ
బ్రాకృతజనులతోఁ బలుమారు చేసెడి
సంసర్గ మను బావి జాఁగు కతన
విషయసుఖంబులే విమలసౌఖ్యంబను
భావసర్పాహతి బడలు కతన
గీ॥ రామ! తికమకఁ జెందుచు రాత్రిఁబవలుఁ
దాపమొందెద నిఁకనైన దయను గనుమి!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౫

సీ॥ కోదండధారివై నాదండ నీవుండ
జమునిదూతలకు నే జంకనేల?
మా యమ్మ సీతమ్మ నాయండ నుండంగ
దుఃఖాబ్ధిలో నేను ద్రుంగనేల?
నా పిన్నతండ్రియై యోపిక సౌమిత్రి
ప్రక్కతోడుగ నుండ భయముదేల?
నాయన్న హనుమన్న నా వెన్కనే యుండ
నాత్మశత్రువులకు నడలనేల?
గీ॥ రామ! నీపాదసేవచేఁ గ్రాలునట్టి
సాధువులు ప్రాపుగా నుండ బాధయేల ?
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౬

సీ॥ నీపాదపూజకై నిత్యంబు పిసువక
పుష్పాంజలు లొసంగు పుణ్యమునకు
నెవ్వ రేమన్నఁ దా మొగ్గు లెంచక వారి
కుపకృతిఁ జేయు నిష్కపటతకును
మునివలె మానముద్రను బూని సంతత
ధ్యానంబునందును దనరుటకును
సమానభావముఁ బూని సంతతంబును ద్వంద్వ
బాధల సహియించి పరఁగుటకును
గీ॥ రామ! నీపూలతోఁటలోఁ గ్రాలుపూల
చెట్టుగానైనఁ బుట్టువుఁ జెందనైతి!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౭

సీ॥ జానకీనాథ! నీసత్కృపచేత నై
రాగ్య మొక్కొకవేళఁ బ్రబలు నైనఁ
బ్రాకృతగుణములు పైపయి మూఁగ నా
స్వాంతంబు గలవరపాటుఁ జెందు
నీపదధ్యానంబు నోపికతోడుతఁ
జేయనేరకయుండఁ జింత మునిఁగి
చిత్తంబు నశముగాఁ జేయలేనైతి పెక్కు
చిక్కుల సుబ్రుక్కుచు దక్కుమాలి
గీ॥ యుంటి శరణంటి సద్గోత్రవుమంటి నిన్ను
వంటివానిని నేఁ గాన నంటిఁ దండ్రి!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౮

సీ॥ నవరత్నఖచితమహా సన్న్యసువర్ణ కి
రీటం బహస్కరుకీతి వెలుఁగఁ
దళతళ మెరయుచు ధవళాతపత్రంబు
కోటిచంద్రులకాంతిఁ గొమరు మిగులఁ
గమనీయతరరుచిఁ గిల్లు కల్కితురాయి
మకుటపార్శ్వంబున మహిమ దనర
చిఱునగవుల భక్తచిత్తంబులను గొను
వదనారవిందవైభవముతోడ
గీ॥ దర్పకోదండధారివై దేవదేవ!
ఎప్పు డీవు గన్పట్టెద వెల్లవేళ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౯

సీ॥ అంతులేనట్టి మహాపచార సహస్ర
ములు చేయుట కొకింత కలతఁ లేదు
దుర్విషయాబ్ధిలోఁ దూఁగి సంతతదుఃఖ
మనుభవించుటకైన నలతలేదు
ఎప్పటి కప్పుడే యిక్కట్లు గాంచుచు
వసగుచుంట కొకింత వంతలేదు
చేసినకృత్యంబె చేయుచు నాయువు
క్షీణించుచుంటకుఁ జింతలేదు
గీ॥ మందమతి నీచు నిత్య మామర్ష మూని
యుంచు నన్ గావుమయ్య! కోదండపాణి!
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౦

సీ॥ అఖిలవేళలయందు సత్యాంతమును జగ
త్సృష్టి స్థితి లయంబుఁ జేయఁగల్గి
సర్వస్వతంత్రత జానొంది యఘటిత
ఘటకత్వశక్తిచేఁ గ్రాలు దీవు
గావున నీసేవఁ గాంక్షించువారికి
కూడఁ బ్రారబ్ధంబుఁ దోసుసేసి
యేడిపించెద వెవ్వ రేడ్వకయుండిరి?
నీభక్తు లిద్ధర నిజముఁ జెప్పుము
గీ॥ గజము ద్రౌపది మఱి గోపికలును గృధ్ర
రాజు మిక్కిలి దుఃఖాగ్నిఁ గ్రాఁగలేదె?
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౧

సీ॥ ప్రాకృతదేహంబుపైఁ గల్గుమమతచే
నాత్మబాంధవు నిన్ను నరయలేక
విషయేంద్రియములచే వివశుండ నయి హృషీ
కేశుని నిన్మది నెంచలేక
తాపత్రయాగ్నిలోఁ దపియించుటన్ భవ
తాపహారకు నిన్నుఁ దలఁపలేక
క్షుత్పిపాసలచేత స్రుక్కుచు నీపాద
సేవామృతముఁ గ్రోలు చింతలేక
గీ॥ లేకయేయున్న వానిగా లోకమందు
జడుఁడనై యున్న నన్ బ్రోవు జలధిశయన
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౨౨

సీ॥ ఇది యిట్టు లనుచు నొక్కింత వాఁ దెఱచి వా
క్యముఁ బల్కుశక్తి లేనట్టివాఁడ
ఏవేళ కేది లభింపఁజేసెదవో నీ
వద్దాని కే భోక్తనైనవాఁడ
కీడు మేలు నెఱింగి కృత్యంబుఁ గావింప
లేశమేనియు బుద్ధిలేనివాఁడ
నస్వతంత్రతతోడ సత్యంత మిడుమలఁ
గుడుచుచు సంకటపడెడువాఁడ
గీ॥ ఘోరసంసార పంకిలకూపమందుఁ
గూలియు న్నీ పదప్రాప్తిఁ గోరువాఁడ
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౨౩

సీ॥ అమిత వాత్సల్య రత్నాకర! రామ! చం
చలచిత్తుఁడను మహాజడుఁడ నైన
నన్నుఁ గుమారుఁగాఁ గన్నవాఁడవుగాన
జన్మంబు లెన్నియో జరుగుచున్న
వెంటనంటియె యుండి కంటికి ఱెప్ప నాఁ
బరిపాలన మొనర్చు ప్రభుఁడవీవ
యైనను స్వాతంత్ర్యమును దనమానుఁడ
వని భయంపడుచు మా యమ్మనైన
గీ॥ జానకీదేవి పాదాంబుజములఁ బడితి
నేమి జేసినఁ జేయని మ్మోమెనన్ను
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౪

సీ॥ సహజమా నానంద జలధిలోఁ దేలక
క్రూరకర్మపుఁగోతిఁ గూలినాఁడ
నిరుపమానం బైన నీగుణావళి వీడి
పాపంపుమాటలు పల్కినాఁడ
అసమానమాధుర్య మగు నీదు నామామృ
తము మాని వేఱొండుఁ దలఁచినాఁడ
సతతనిర్హేతుక జాయమానకటాక్ష
వీక్షణుఁ డగునిన్ను వీడినాఁడ
గీ॥ సకలకాలములందు మహాపచార
జీవనుఁడ నైన నన్నెట్లు చేరతీతొ?
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౫

సీ॥ నిర్మలమణిసౌధ భర్మడోలాకేళి
శృంగారరసము సీతాంగనకును
తాపసోత్తములకు దండకారణ్యసం
చారంబునం దతిశాంతరసము
యుద్ధరంగమునఁ బ్రసిద్ధపరాక్రమ
రాక్షసపాళికి రౌద్రరసము
స్వాశ్రితభక్తరక్షానల్పదీక్షయం
దధిక మానట్టిదయారసంబుఁ
గీ॥ జూపు చనిశం బఖండ తేజోవిశేష
మున నతాంహస్తమం బెల్లఁ బోనడంతు!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౬

సీ॥ స్వీయమహాభరమెల్లఁ బ్రీతిగ నీపాద
పద్మంబులకు సమర్పణ మొనర్చి
ఫలకాంక్ష విడిచి నిర్మలధర్మ మూనుచు
స్వాంతమం దతిభక్తి సంతరించి
నిత్యంబు విసువక యత్యంతమగుశ్రద్ధ
నర్చావిధానకృత్యములఁ జేసి
దినదినమును బని మనవిఁజేయుచుఁ ద్వత్కృ
పామహితప్రతిభను గడించి
గీ॥ భరతువలెఁ దాల్చెదను నీదుపాదుకలను
సమ్మతింపుము దీనికేన్ జగదధీశ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౭

సీ॥ ఏనాఁడుగల్గు? లక్ష్మీనాథ ! నీపాద
        సేవాధనం బవిచ్ఛిన్నముగను
    ఎప్పాటఁ గాంతు మా యప్ప ! నీభువనైక
        మోహనం బైనట్టి ముద్దుమోము
    ఏవేళ లభియించు నిందీవరశ్యామ !
        తావకనామామృతంబుఁ గ్రోల
    ఏకాలమున నబ్బు లోకేశ ! నీదుకైం
        కర్యముల్ సేయుభాగ్యంబు నాకు
  గీ॥ అఖిలభాగవతాంఘ్రిదాస్యానుభావ
      మిచ్చి ననుబ్రోచు టిఁకనెప్పుడెపుడో ? రామ !
      హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
      తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౨౭

సీ॥ నావంటిదురితాత్మునకుఁ గల్గనేర్చునే?
        తావకీనపదాబ్జసేవనంబు
    ననుఁబోలుగర్విష్ఠునకు లభియించునే?
        త్వజ్జన్మవేళ నభ్యర్చనంబు
    నాబోటివిషభావునకును బ్రాప్తించునే
        తావకభక్తిసుధారసంబు
    నాయంతమోహాంధునకు సమకూరునే
        త్వన్ముఖరాకేందు దర్శనంబు
  గీ॥ ఏదిగతి నాకు రక్షకుం డెవ్వఁడయ్య ?
      నీ వనాదృతిఁ జేసిన నీరజాక్ష!
      హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
      తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౨౮

సీ॥ క్షణమైన నీపాదజలజచింతన లేని
మందభాగ్యుఁడ నైతి నిందిరేశ!
కలనైన నీకు మ్రొక్కక యుండునంతటి
పాపకర్ముఁడ నైతిఁ బరమపురుష!
గడియసేపైన నిన్ గనులఁ గాంచనియట్టి
మూఢచిత్తుఁడ నైతి మోహనాంగ!
ఒకపరియైన నిన్ బ్రకటింపఁజాలని
దురితాత్మకుఁడ నైతిఁ దోయజాక్ష!
గీ॥ ఇంతదౌర్భాగ్యనెలవైన నేలుకొనుము
వమితవాత్సల్యజలనిధి వైననీవు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౩౦

సీ॥ చాలదే? శిలవృత్తి జఠరాగ్నిఁ జల్లార్ప
సస్యవృత్తులకు నల్లాడ నేల?
చాలదే? దప్పిక సమయింప నదినీరె
పానీయములకునై పరుగు లేల?
చాలదే? యొకగోచి జననేంద్రియముఁ గప్ప
కౌశేయములకునై కలఁత యేల?
చాలదే? నిజబాహుశాఖయే దిండుగాఁ
బాలీసులకు నింతబాధ యేల?
గీ॥ చాలదే? భూమి శయ్యయై సౌఖ్య మొసఁగ
నీకృపాపాత్రుఁ డైనట్టి నిపుణమతికి
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౩౧

సీ॥ ఆత్రిముతోడ దురాశావశుండనై
సంసారకాంతార సరణిఁ జొచ్చి
తాపత్రియాభీల దావాగ్ని పైఁ గ్రమ్మఁ
గా నుడ్డుఁగుకుచుచుఁ గళవళించి
కామరోషాది రాక్షసవర్గ మాహార
వాంఛ మీఁదికి దూఁక భయముఁ జెంది
యేద్పుటకైన నొక్కింత దార్ఢ్యము లేక
యలసతఁ గాంచుచున్నట్టి నాకుఁ
గీ॥ దావకపదాబ్జ సేవామృత ప్రవృష్టి
దిక్కుగాక మఱెయ్యది దిక్కు లేదు
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! 34

సీ॥ వద్దు వద్దుర! రామభద్ర! నాతో వాదు
బలవద్విరోధంబుఁ బాడి గాదు
ప్రభునికన్నను మొండి బలవంతుఁ డగుట నీ
తొండిసేతల సాగకుండఁ జేతు
కనుచూపులో నిన్నుఁ గదలనీయక నిల్పి
స్వాంతరజ్జువున నిన్ బట్టి కట్టి
హృదయగుహను బెట్టి పదిలముొనర్చెదఁ
గవివాక్య మిది వృథాగాదు సుమ్ము
గీ॥ నేనుఁ గవినాదునో? కానొ? నీవె పలుకు
కవినిగాఁ జేసితివి నీవ కాదె? నన్ను
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! 35

సీ॥ జ్ఞానశక్తులు బలైశ్వర్యముల్ వీర్యతే
జస్సులు నీయందె సంవసించు
నటులౌట భగవంతుఁ డనఁగ నీవొకఁడవే
యగుదు వన్యుం డెట్టు లగును? రామ!
కరిరాజు నెవరు రక్షణముఁ జేసిరి? త్రిలో
కముల నల్లాడు కాకమున కెవఁడు
ము న్నడ్డుపడియె? వేల్పులలోన సర్వశ
క్తుఁడవు జగద్రక్షకుఁడవు భక్త
గీ॥ వత్సలుండవు సత్కృపావార్ధి వశల
సేవకానందమూర్తివి నీవ దేవ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! 3౬

సీ॥ ఆరుగంటలకు నే నాచరించెద స్నాన
మది యెంత కనఁ దెలియదుర! రామ!
తిరుమణికాపును దిద్దెద ముఖమందు
నది యేల నన దెలియదుర! తండ్రి!
గాయత్రి జపియింతుఁగాని యే మది యని
యడిగినయెడఁ దెలియదుర! దేవ!
భగవదర్చన నెట్టిపనిమీఁదఁ జేసెద
నని యడిగినఁ దెలియదుర! శ్రీశ!
గీ॥ వట్టిబూటక వేసంబె బెట్టుకొన్న
మూర్ఖునకు నెట్లు నీపాదములు లభించు?
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! 3౭

సీ॥ పట్టెడుజందెముల్ పదిలంబుగా ధరిం
చితి దానితత్త్వంబుఁ జింతసేయ
నఖిలకాలములందు హరిసేవ సేయుఁ డం
చని చెప్పినను దాని నాచరింప
నేసూత్రి మని యెవ్వరేనిఁ బ్రశ్నింప నై
ఖానసమనెద నద్దాని నెఱుఁగ
ననవరతంబు మిథ్యాచారమును బూని
యును నైష్ణవుఁడ ననుచుందు లోక

గీ॥ వంచనము సేయుటకు నిటువంటి దుష్ట
శీలు నెటు బ్రోచెదవొ? దయాశీల! రామ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౩౮

సీ॥ పరిజనందఱకు మహాభక్తుని పగిది వే
షముచేతఁ గన్పడు జడమతుండ
హృదయమందున భక్తి యెట్టిదో తెలియని
యట్టిదుస్తామసుం డైనవాఁడ
హరిదాసుఁ డితఁ డని యనుట కొప్పిద మైన
పల్కులాడెదు నాత్మవంచకుండ
నఖిలంబు నీకు సమర్పించితి నని వా
జ్ఞాత్రింబె జెప్పుదుర్మార్గరతుఁడ

గీ॥ నింతపాపిష్ఠునకు నింక నెట్లు నీదు
పాదసేవ లభించురా? పరమ పురుష!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౩౯

సీ॥ చలిపందిరిని జేరు జనులచందంబున
నొక్కతావునఁ గూడుచుండ్రు లోకు
లట్టులే క్రమముగా సరుగుచుందు రటంచుఁ
బెద్దలు జెప్పఁగా వినియుఁ గనియు
బుద్ధిలోపల దానిఁ బూని నిల్పఁగలేక
ద్రొక్కులాడుచు సుఖదుఃఖములకు
స్రుక్కుచు సొక్కుచు దిక్కుమాలినవారి
దిక్కయి బ్రోచు నీ దిక్కుఁజేరి
గీ॥ మ్రొక్కులిడునన్నుఁ గావవే! మోహనాంగ!
దీనరక్షక! సర్వేశ! దేవదేవ!
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౪౦

సీ॥ సుఖదుఃఖములు గల్గుచో మోదఖేదముల్
గానకుండెడునట్టి జ్ఞానిఁగాను
అనవరతంబు భక్త్యతిశయమున మేను
మఱచియుండెడి శుభమతినిఁగాను
కామరోషంబు లుగ్రంబుగఁ బైఁగ్రమ్మ
వాని సుంత యడంచువాఁడఁగాను
నీదు తత్త్వము దెల్పు నిర్మలగ్రంథముల్
పఠియించునట్టి నేర్పరినిఁగాను
గీ॥ ఏమిగని నన్ను రక్షింతు విందిరేశ!
పరమ దౌర్భాగ్యుఁడను జుమ్మి పద్మనాభ!
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపునాధినాథ! సీతాసనాథ! ౪౧

సీ॥ నాగుణమేలరా? నళినాక్ష! నన్బ్రోవ
నెంచెదవేని నీహృదయమందు
నాగుణమేలరా? నళినాక్ష! నన్బ్రోవ
నెంచవయేని నీ హృదయమందు
నీదు కారుణ్యంబు నీ పెంపు నీ సొంపు
నీ స్వభావంబును నీగుణంబు
నీదు వాత్సల్యంబు నీ యుదారత్వము
నీ మహామహిమయు నీ ప్రభుత్వ
గీ॥ మెంచి రక్షింపు మిట్టి యకించనజనుఁ
బట్టి శోధింపవలయునే? పంకజాక్ష!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౪౨

సీ॥ ఆత్మవంచకులలో నగ్రగణ్యుఁడ నేను
క్షుద్రులలోన నక్షుద్రగతిని
మర్యాద నేన యమర్యాదలకునెల్ల
చపలులలోపలఁ జపలమతిని
పాపిష్ఠులం దతిపాపిష్ఠుఁడను నేన
కామదాసులలో నఖండయశుఁడ
క్షమఁ గృతఘ్నులలోనఁ గడుఁ గృతఘ్నుఁడ నేను
దుండగీఁడులఁ జాల దుండగీఁడ
గీ॥ నైతి నెట్టులు దుఃఖాబ్ధినంత దాటి
నీపదాంభోజయుగళంబు నేను గాంతు?
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౪౩

సీ॥ నా యఘాళి గణించి న్యాయశాస్త్రమురీతి
దండింపఁ గా దండధరున కీవు
న న్నప్పగింపకు నారాయణా! జగ
న్నాథుఁడ వీవౌట నన్ను బ్రోవ
శిక్షింప నీకుఁగా కీక్షితి నెవరికిఁ
గలదు స్వాతంత్ర్యంబు కలుషహరణ!
దండింప నెంతు వేని దండింపు నీపాద
తరుణాబ్జమున నొకతన్నుఁ దన్ని
గీ॥ యట్టులైనను మతిగల్గి యడఁగియుందు
నేమొ? దాసానుదాసుఁడనై మహాత్మ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతానాథ! ౪౪

సీ॥ తనకుమారునిఁ దండ్రి దండితుఁ జేయుచో
వల దని చెప్ప నెవ్వండు జాలు?
తనపతియే సతితనువు నమ్మెడుచోట
నన్యుఁడు వల దటంచనఁగఁ దరమె?
తనతల్లి విషమిడఁ దలఁచెడునెడ దాని
మాన్పసమర్థుఁడౌ మనుజుఁ డెవఁడు
తనుఁగొల్చువానినే దైవంబు శిక్షింప
రక్షింపనెవఁడు సత్ప్రభువుగలఁడు
గీ॥ తండ్రి భర్తయుఁ దల్లియు దైవమీవె
సహజముగ నాకు నగుదువో సరసిజాక్ష!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతానాథ! ౪౫

సీ॥ జానకీశ్వర ! నీదు చరణపంకజములే
శరణం బటన్న నిశ్చయముతోడ
నెల్లకాలంబుల నుల్లసంబునఁ గౌఁగి
లించుకొనెద విడలించి నన్ను
నెట్టివైచినఁగాని నేను ని న్వదలక
పెనఁగులాడెదఁగాని విడువలేను
ఆకొన్న బాలుఁ డమ్మా! యాచుఁ గాళులం
బడిన జనని నెట్టివై వఁగలదె ?
గీ॥ వైచినను నెడబాయునే ? పాసెనేని
మఱియొకటి దిక్కు గల్గునే ? మదనజనక !
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౪౮

సీ॥ నీలమేఘచ్ఛాయఁ బోలు దేహముతోడఁ
దరుణారవింద నేత్రములతోడ
నందమౌ సరిసరియవయవంబులతోడఁ
గరితుండనిభ దోర్యుగంబుతోడఁ
జిఱుగంటమ్రోతలఁ జెలఁగు ధనువుతోడ
ముగ్ధమోహనముఖాంబుజముతోడ
లలిఁ గృపామృతముఁ జిప్పిలుకటాక్షముతోడ
సలలితమందహాసంబుతోడ
గీ॥ నమితవాత్సల్యజలధి మా యమ్మతోడ
వచ్చియొకమాటు నాకుఁ గన్పట్టుమయ్య
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౪౯

సీ॥ జేనెడుపొట్టకై భూనాయకుల ముంగి
ళుల బల్లివలెఁ బడి యలతఁ జెంది
యొనగూర్చినట్టిదౌ ధనము దంభన మగు
నని తలపోయుచు నహరహంబు
సుమనస్సమారాధనము భరతాభీష్ట
దము హనుమత్సేవితము శుభదము
రావణసోదర రక్షకమును మహిష్ట
కాకజీవాధారకము నతార్త
గీ॥ భక్తసంజీవనంబునై బరఁగుసీదు
పాదుకాధనమే గొల్చిబ్రిదుకువాఁడ
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౪౭

సీ॥ శృంగారమైనట్టి బంగారుశాల్వచె
ఱంగులు వెనుకఁ జీరాడుచుండ
నతసీకుసుమకాంతి నవఘళించెడు మేని
చాయ సద్దిక్కులఁ జాదుకొనఁగఁ
దారహారద్యుతితతి భక్తనయన చ
కోరములకు జ్యోత్స్నయై రహింప
వజ్రితనుత్రాణవై భవం బాశ్రిత
భయకారణం బౌచుఁ బ్రోదిమీఱ
గీ॥ నొక్కపరియైన నామది నొప్పిదముగ
వచ్చి కన్పడఁజాలవా? వనరుహాక్ష!
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౪౮

సీ॥ ముద్దులు గురిసెడు మోముపై ముంగురుల్
కొదమతుమ్మెద లనఁ గొమరుమిగులఁ
గాటుక కన్నీరు కమలనిస్సృతసుధా
సారంగురీతిఁ జెంపారుచుండ
గళమున మీల్మిబంగరుకంటె పూర్ణేందు
పరివేషకాంతులఁ బరిహసింప
ధరణిఁ దొగాడుచుఁ దల్లిఁజేరఁగఁబోవఁ
గాలుసేతులు డస్సి నేల బొజ్జ
గీ॥ సోకను బరుండి తలయెత్తి చూచు చిన్ని
చూపులను నేఁడు నన్నిటు చూడవయ్య!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౦

సీ॥ కాకపక్షములు మేఘంబుల హసియింప
నెమ్మోము రాకేందునిన్ జయింప
అమలినతారహారావళి నక్షత్ర
ములకాంతి నుల్లసంబున గ్రసింప
ఇందీవరశ్యామ సుందరదేహంబు
పరివిమలాకాశగర్వము హరింప
చిఱునవ్వు వెన్నెలముఱువెల్ల డింపఁగ
శ్రీరామచంద్రుఁడవై రహించు
గీ॥ నీదు బాల్యవపువుఁ గాంచునిర్మలుండు
జూచునే యన్యమును దన్నుఁబ్రోచు నంచు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౧

సీ॥ శరశరాసములు హస్తంబునఁ దాలిచి
పేర్మితో సౌమిత్రి వెంటరాఁగ
మకుటతటోల్లసన్మణిమాలికలకాంతి
బాలసూర్యుని సొంపుఁ గేలిసేయ
నక్షయశరధి వెన్నంటి రిపుక్షయ
మును దెల్పుటకు నృత్యమునఁ జెలంగ
పరివిమలభాస మా స్వర్ణోపవీతంబు
నీలాభ్రగతశంపఁ బోలుచుండ
గీ॥ యజ్ఞరక్షణమునకుఁ బిత్రాజ్ఞ గాధి
తనయుతో నేఁగునీచక్కఁదనము నెంతు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౨

సీ॥ తలఁబ్రాలుఁబోయు సీతాదేవిబాహుమూ
లములపై నేత్రపద్మములపైన
పార్శ్వస్థభామాళిపై సభాసదులపై
లలితాక్షతలనుంచు తెలెలపైన
రత్నశోభితనూపురముల బెడంగుపై
స్వర్ణకౌశేయవస్త్రంబుపైన
పైటచెరంగుపైఁ బాతరలాడుచుఁ
జెలువొందునోరచూపులను నేఁడు
గీ॥ జూడుమీ నన్ను నొకపరి సుందరాంగ!
దయయొకించుకగలదేని దాచుకొనక
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౩

సీ॥ కామంబు నంతయుఁ గాఱింపఁగాలేక
శాస్త్రనిషిద్ధముల్ జరిపిజరిపి
జరుపుచు జరుపంగ సమ్మతించుచు నుంచి
నిశ్చయముగ నిది నిజమురామ!
పదుగురు జూడంగ భక్తునివలె వేష
మును దాల్చి చరియించు ననవరతముఁ
బ్రకృతివశుండనై బ్రజ్ఞఁ గోల్పోయి సం
సారకూపంబున జారిపడితి
గీ॥ సభయహస్తంబుతోడ నన్నాదరించి
యుద్ధరింపుము వేగఁ బ్రసిద్ధచరిత!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౨౪

సీ॥ శరణాగతత్రాణ బిరుద మేమానురా?
దాసుని నన్నేలఁ దలఁపకున్న
నార్తరక్షకుఁ డన్నకీర్తి యేమానురా?
యార్తుఁడ నాగతి నరయకున్న
వాత్సల్యజలధి వన్ వాక్య మేమానురా?
మూర్ఖుఁడ నగునన్నుఁ బ్రోవకున్నఁ
గరుణాబ్ధి వనెడు నీ ఘనత యేమానురా?
కరుణావిహీను నన్ గావకున్న
గీ॥ నర్థిమందారుఁ డనుట యేమాను దండ్రి!
యర్థి నౌ నను బ్రోవవే నంబుజాక్ష!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౨౫

సీ॥ బ్రహ్మరుద్రాది దేవతలెల్ల రెద్దాని
శిరములఁ దాలిచి చెలఁగుచుండ్రు
మునిసంఘములు నిత్యమును ఫాలమున దేని
దాల్చుటకై ప్రయత్నంబొనర్చు
నెద్దాని గాలి యొక్కింతయు సోకిన
జడమేని ముక్తికిఁ జనుచు నుండు
గౌతమాంగనఁ బ్రోవఁగా నెద్ది తానయ్యె
వాత్సల్యమును జూపి వరలె నట్టి
గీ॥ నీపదాంభోజ రజమును నే భజింపఁ
గోరుచున్నాఁడ నద్దానిఁ గూర్పుమయ్య!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౬

సీ॥ నావాఁ డనుచు నీమనంబున నుంచినఁ
జాలు వేవేల్ గోరజాల రామ
యెచ్చోటనుండిన నెచ్చోటఁ బండిన
నెచ్చోట జనిన నింకేమిభయము?
సర్వగతుండవై సర్వేశ్వరుండవై
సర్వనియంతవై సర్వచేత
నాఽచేతనాత్మజీవాధారకుండవై
యమితవాత్సల్యాబ్ధి వైన నీకుఁ
గీ॥ చేతు లెత్తి ప్రణామముఁ జేసినాఁడ
సత్యముగ నేను నీవాఁడ జలరుహాక్ష!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౭

సీ॥ నీచజన్మ మొసంగి నిరయంబునం గూల్చి
గావునఁ బాపంపుఁగర్మఫలము
మంచిజన్మము నిచ్చి మంచిలోకముఁగూర్చఁ
గావునఁ బుణ్యంపుఁగర్మఫలము
వాత్సల్యనిధి వయి వారింపవే యవి
రెండును బ్రాప్తింపకుండఁ జేసి
యినుపసంకెల పాప మనియు బంగారుసం
కెల పుణ్యమనియుఁ బెద్దలు వచింతురి
గీ॥ జన్మమిడుటకు రెండును సమములౌటఁ
బుణ్యమును పాపమును నీవె పోనడంపు
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౭౮

సీ॥ కరిరాజుఁ గాచిన కరుణాబ్ధి వని యందు
ద్రౌపదిఁ బ్రోచు నుదారుఁడంచుఁ
బ్రహ్లాదు రక్షించు భక్తవత్సలుఁ డందు
వల్లవీజనమనఃప్రభుఁడ నందు
గజపతి నేలెడుఘనబుద్ధి వనియందు
నకూ్రరుఁ బ్రోచుదయాళు వంచుఁ
గాకంబుఁ బోషించు శ్రీకరుఁడనియందు
నాపాలిభాగ్య మైనాఁడ వందుఁ
గీ॥ బ్రోవుమా ! రామ ! యంచు వాపోవుచుందు
నేమిచేసినఁ జేయు మిం కేమనందు ?
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౭౯

సీ॥ స్వాభావికముగ సర్వంబు నీదై యుండ
నేను నాది యటంచు బూని మోహ
మాత్మ వంచకుఁడనై యత్యంతదుఃఖంబు
లందితి ''మునుపు'' గోవింద! యిప్పు
డిది నాదికాదు నీయది నేను నీవాఁడ
నని యప్పగించితి గనుక నీవు
స్వామివి న న్నెట్లు జరిపిన జరుపుము
మంచిచెడ్డలు మది నెంచఁబోక
గీ॥ భారమంతయు వీడి నీపాదయుగళి
నిర్భయత నిర్భరత నుందు నీరజాక్ష!
హతవిరాధ!విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ!సీతాసనాథ! ౬౦

సీ॥ బంగారుధనువులు రంగారుచుండంగ
వామహస్తముల భాస్వరము లగుచు
సన్నద్ధకవచులై సర్వాశ్రితవ్రాత
దాస్యపరాధీనతత్వ మొప్ప
నర్ధచంద్రాకార మగుశరంబులఁ గుడి
కేల ధరింపుచు లీలతోడఁ
జిఱునవ్వు కెమ్మోవిశృంగారమును బెంప
భక్తాభయప్రదప్రభుత మెరయ
గీ॥ నీవునుం దమ్ముఁడును దోడునీడ లగుచు
నాకు సాక్షాత్కరించు టెన్నండు? రామ!
హతవిరాధ!విధూతసర్వాపరాధ
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౬౧

సీ॥ జపమొనర్పంగ నెంచి జపమాలఁ జేఁబూన
నది తటాలున భూమియందుఁబడును
ధ్యానంబొనర్పంగఁ దలఁచి కూర్చుండినఁ
బైపయి నిద్దుర ప్రబలుచుండు
ధరణిపై సాష్టాంగదండ మర్పింప నెం
చిన మనం బిసుమంత వినదు మాట
నీనామమును బల్కఁ నేఁ గోరఁగా జిహ్వా
సేయ దద్దాని విధేయమగుచు
గీ॥ తనువె ప్రత్యక్షశత్రువై తనరుచుండ
దీని పొత్తిఁక మాన్పవే దేవదేవ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౬౨

సీ॥ స్థూలప్రకృతియాచుఁ జూపట్టు దేహంబు
స్వాంతంబు సూక్ష్మ మౌ ప్రకృతియగును.
స్థూలదేహం బొక్కచోఁ బడియుండు స్వ
భావంబుగల దాట బాధలేదు
సూక్ష్మశరీర మెచ్చోనైన దిర్గు స్వ
భావంబుగలదాట బదియునాల్గు
జగములఁ జరియించి క్షణములో నెప్పటి
యట్ల సమీపంబు నంద నిలుచు
గీ॥ నట్టిదాంగను నీదు పాదాంబుజముల
యం దణచిపెట్టి వదలకు మయ్య యెపుడు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౬౩

సీ॥ సర్వధర్మంబులు జయ్యనఁ ద్యజియించి
నన్నొక్కనిని శరణంబు చొరుము
నేను నీదగు పాపనిచయంబుఁ బోద్రోలి
యభయంబు గూర్చెద నడలబోకు
మని చరమశ్లోకమున నీవు చెప్పిన
మాటల నమ్మి జంజాటమెల్ల
మాని నీపాదపద్మంబులే శరణంబు
గా నమ్మియుంటి నిక్కముగ నాదు
గీ. నమ్మికను వమ్ముచేయక సమ్మతించి
రమ్మభయ మిమ్ము ఘోరపాపమ్ముఁ జిమ్ము
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౬౪

సీ॥ జ్ఞానస్వరూపుఁడ వైన నిన్ మెప్పింప
విద్య యున్నదె? భక్తివిద్యగాక
శ్రీసనాథుఁడ వౌచుఁ జెలగు నీ కర్పింప
ధనమున్నదే? మనోధనము గాక
పరమాత్మ వగు నీకుఁ బరితోషముం గూర్చ
ఫల మున్నదే? యాత్మఫలము గాక
భక్తవత్సలుఁడవై బరగు నీదరిఁ జేరు
పథ మున్నదె! ప్రపత్తిపథముగాక
గీ॥ నిఖిలమును నీవుగా నెంచు నిపుణమతికి
నియతి యున్నదె? కైంకర్యనియతిగాక
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౬౫

సీ॥ నిజము విచారింప నీ వెట్టులుందువో?
యెచ్చట నుందువో? యెవఁడటంచు
నైనను నళినపత్రాయతేక్షణుఁ డని
యిందీవరశ్యామసుందరుఁ డని
కోదండధరుఁ డని గుణనిధి యని కరు
ణావార్ధి యని మహానందుఁ డనుచు
నాగమము వచించు నటులెట్ల నీరూప
మును జూడఁ గోరితి మనమునందుఁ
గీ॥ గామితార్థదుఁ డగుట నిక్కంబయేనిఁ
గానర మ్మొక్కపరియైన గరుడగమన!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౬౬

సీ॥ చండాతపంబుల మండిపోవువేళ
శీతాంశుశైత్యంబుఁ జెందువేళ
నభ్రమండలములో నలసతఁ గనువేళ
నరకయాతనలచే నలఁగువేళఁ
బవనంబులోఁ జిక్కబడి కొట్టుకొనువేళ
వర్షధారల భూమిఁ బడెడువేళ
సస్యగతుండనై జఠరాగ్నిఁ బడువేళ
బురుషు నండంబుల బొరలువేళ
గీ॥ మాతృగర్భంబునం జొచ్చి మలయువేళ
దిక్కు నీవొక్కఁడవెకదా? దేవదేవ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౬౭

సీ॥ గర్భగుహాంతరగతుఁడనై మలమూత్ర
ములరొంపిలోఁ దల మునుగు వేళ
వేయి తేళ్లులు గుట్టువిధమున శ్రమగల్గ
వికటమౌ ద్వారాన వెడలు వేళ
దోమలీగలు బాధితునిఁ జేయ వారింప
గాలేక శోకాగ్నిఁ గ్రాఁగు వేళ
బాల్యకౌమారయౌవనవార్ధకంబుల
సలఁగుచు మృత్యువు గలుగు వేళఁ
గీ॥ బుణ్యపాపలోకములకుఁ బోవు వేళ
నీవె యాత్మసఖుండవై నిలిచె దార !!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౬౮

సీ॥ స్థావరోద్భిజ్జాండజములయందును జరా
యుజములలో జన్మ మొందునపుడు
కలయోనులం దెల్ల గర్భాద్యవస్థల
నొడలెఱుంగక కడు బడలునపుడు
శైశవాద్యఖిలదశాప్రాప్తసుఖదుఃఖ
డోలికాహతుఁడనై తూలునపుడు
మృత్యువశుండనై మిడుకుచుఁ బాపపు
ణ్యపుసంకెలలఁ జిక్కి యడలునపుడు
గీ॥ నొక్కపరి నిన్ను స్మరియించియుంటినేని
యిట్టి తను వేల గల్గురా ? యింది రేశ !
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౬౯

సీ॥ ఒకమాటు నిన్ వేడుకకునైన బిల్చిన
ఘోరదుఃఖాగ్నిఁ గ్రాగుదునె? రామ
ఒకసారి నీశక్తి బ్రకటించితినయేని
దుష్టజన్మంబు లెత్తుదునె? రామ!
ఒకక్షణమైన నా కొడవిన నీసేవ
తోడ్తోడఁ గష్ట మొందుదునె? రామ!
ఒకగడెయైన నిన్నఁ గలుషఁ జూచిన
మదిలోనఁ జింత నొందుదునె? రామ!
గీ॥ ఒకనిముసమేని నన్ బ్రోవు మో దయాబ్ధి!
యనుట గల్గిన భవ మేటికబ్బు? రామ!
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౨౦

సీ॥ గౌరీవిభునికన్న ఘనుఁడనే? నీనామ
జపసార మెఱుగంగ జగదధీశ!
ఉద్ధవుకంటె నే నుత్తముజనుఁడనే?
నీతత్త్వ మెఱుగంగ నీరజాక్ష!
ప్రహ్లాదుమించిన భక్తుండ నగుదునే?
నీరూప మెఱుగంగ నిఖిలరూప!
వాల్మీకిమునికంటెఁ బరమవిజ్ఞానినే
నీకథ లెఱుగంగ నిష్కళంక!
గీ॥ ఏమి గని నన్ను రక్షింతు వింది రేశ!
కాయ మున్నది నీకు కైంకర్యమునకు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౨౧

సీ॥ దయచేసితివిగదా? దండ మర్పింపంగ
శిరము నా కొకటి లక్ష్మీవిహార!
నిర్మించితివిగదా? నేత్రము లొకరెండు
నీమూర్తి సేవింప నీరజాక్ష!
కల్పించితివిగదా? కరయుగ్మమును నీదు
పాదముల్ బూజింపఁ బరమపురుష!
కల్పించితివిగదా? కాళ్ళను నీకుఁ బ్ర
దక్షిణము లొనర్ప దైత్యహరణ!
గీ॥ తను నొసంగితి విట్లు నిదరికిఁ జేర
సాధనంబుగ వాత్సల్య జలధి వౌచు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౭౨

సీ॥ నాకు నాల్క నొసంగినాఁడవు నీదివ్య
నామంబు జపియింప శ్రీమనోజ్ఞ!
నాకు ఘ్రాణ మొసంగినాఁడవు నీపాద
తులసి నాఘ్రాణింప దురితశమన!
నాకుఁ జిత్త మొసంగినాఁడవు నీగుణ
చింతనం బొనరింప శ్రీనివాస!
నాకు వాకు నొసంగినాఁడవు నీకథా
గానంబు గావింప జానకీశ!
గీ॥ ఇన్నిటి నొసంగి రక్షించునిన్నుఁ గొల్వ
నేరని కృతఘ్నుఁడను జుమ్మి మారజనక!
హతవిరాధ! విధూతసర్వాపరాధ
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! 23

సీ॥ ప్రకృతికిఁ బ్రత్యగాత్మకు ధారకము పోష
కము నీవ యగుదు నికర్షముగ భూమి
నేవేళ కెవరి కేమేమి కల్పింపంగ
వలయునో? దానిఁ గల్పన మొనర్చి
రక్షణం బొనరించు రక్షకుండవు గాన
గతివి భర్తవు నధిపతివి సాక్షి
వాత్మసఖుండవు నై నట్టి నీదు శ్రీ
చరణాంబుజంబులే శరణ మంచు
గీ॥ నున్నవాఁడనురా నను గన్నతండ్రి!
వాస్తవమె పల్కుచుంటినో వనధిశయన!
హాతవిరాధ! విధూతసర్వాపరాధ !
తమ్మరవురాధినాథ! సీతాసనాథ ! ౭౮

సీ॥ కోటిసూర్యులకాంతిఁ గొమరొప్పు న ప్పర
మవ్యోమమందు సంభావ్యమగుచు
జ్ఞానశక్తులు బలైశ్వర్యముల్ వీర్యతే
జంబులు గొల్వ విస్తార మగుచు
ఒకకాలు ముడిచి వేరొకకాలు జాపి దీ
వ్యదభిన్న భూమల నందమగుచు
శ్రీభూమినీళలు జెలువొందగా భోగి
భోగస్థమై దివ్యపూజ్యమగుచు
గీ॥ బరగు నీ పరవాసుదేవస్వరూప
మెప్పు డేఁకఁ గాంచగలను? మా యప్ప చెపుమి
హాతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరవురాధినాథ ! సీతాసనాథ ! ౭౯

సీ॥ గతజన్మములలోనఁ గరుణానిధీ! నీకు
నొకసారి మ్రొక్కియే యుంటినేని
గతకల్పములలోనఁ గమలేశ! నీనామ
మొకసారి నుడివియే యుంటినేని
గతదినంబులలోనఁ గామితార్థద! నిన్ను
నొకసారి పిల్చియే యుంటినేని
గతవర్షములలోనఁ గాకుత్స్థతిలక! ని
న్నొకసారి పూజించి యుంటినేని
గీ॥ మఱల జన్మంబుఁ గాంతునే! మదనజనక!
పాడుబుద్ధిని చెడిపోయినాఁడగాక
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౨౬

సీ॥ దేహ మాత్మయటంచు మోహ మొందుటఁగదా?
నాది సర్వమటం చనఁగవలసె
దారసుతప్రేమ దవిలియుండుటఁగదా?
కామాగ్నిలోఁ బడి కాఁగవలసె
విషయసుఖాసక్తి పీడించుటనెకదా?
ధర్మమార్గము లెల్లఁ దలఁగవలసె
ద్రవ్యాభిలాష మెంతయుఁ గల్గుటనెకదా?
లోభిమానవులకు లొంగవలసె
గీ॥ హృదయమున నిన్ను నమ్మని హేతువుననె
యిన్నికష్టంబు లొందుచు నేడ్వవలసె
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౨౭

సీ॥ శంఖంబుఁ జక్రంబు శార్ఙ్గంబు గదయును
నందకం బిరుగడలందు వెలుఁగ
హారకిరీటకేయూర కంకణకట
కాంచీయుతనూపురాళి మెసఁగ
మేఘంబుపై నున్న మెఱుఁగుచందంబున
వలనొప్పు పచ్చనివలువ దనర
భక్తరక్షాదీక్షఁ బ్రిధనహించినయట్టి
బాహాచతుష్కవైభవము గలుగ
గీ॥ క్షీరసాగరమందున శేషశాయి
వైన నిన్ గాంచు టెప్పుడు నా కబ్బఁగలదొ?
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౭౮

సీ॥ తరుణారవింద నేత్రప్రాంతముల సత్కృ
పానదు లెప్పుడు జాల్వారుచుండ
హస్తపల్లవమునం దలరు పిల్లనగ్రోవి
మోవితో బాంధవ్యమును ఘటింప
నెమిలిపింఛపుదండ కమనీయమై శిర
స్సీమునఁ గాంతులఁ జెలఁగుచుండఁ
గాళ్ళకుఁ గలరత్నకలితనూపురఝళం
ఝళరావ మతులమై జానువీట
గీ॥ వేణుగోపాలమూర్తివై వెలయునీదు
విభవ మెన్నఁడు గాంతురా? వేదవేద్య!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౭౯

సీ॥ ఆజానులంబబాహాచతుష్టయముతో
దివ్యకుండలమణి దీప్తితోడ
హారకిరీటాంగదాదిభూషాళితోఁ,
గౌస్తుభరత్నవక్షంబుతోడ
వనమాలికావృత తనువిలాసంబుతో
లలితసౌవర్ణచేలంబుతోడ
నింద్రనీలచ్ఛాయ లీను దేహంబుతో
కరుణాకటాక్షవీక్షణముతోడ
గీ॥ దేవకీవసుదేవుల కీవు పుట్టి
యింటఁ జూపినరూపంబు నే స్మరింతు
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౪౦

సీ॥ దారసుతాదులందలి మోహమను పశ
మెల్లెడ నొడలిపై నల్లుకొనుట
వివశుండనగుచు నిర్వేదంబుతో మత
నడలుచు నడలుచు బడలుచుంటి
దురితలతావళుల్ దునుమ జాలిన నీదు
నామమన్ ఖడ్గంబు నాకునిమ్ము
దానిచే మోహబంధంబులు వీడ నం
చందముగా గాన ననంత ! నీదు
గీ॥ నామమే తారకం బని నమ్మినాఁడ
కామితార్థద ! నీముందుఁ గల్లలాడ
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౪౧

సీ॥ కామంబుకన్న బల్ గడుసు క్రోధం బెన్నఁ
గామవిఘ్నంబౌటఁ గల్గు నద్ది
కాముని గెల్చిన కాత్యాయనీపతి
కోపంబును జయింప నోపఁడయ్యె
నాత్మశత్రువులలో నగ్రగణ్యంబు లీ
రెండింటి నిఁక నీవె చెండవలయుఁ
గాని నాచేత నే మౌనురా! శ్రీరామ!
సర్వజ్ఞుఁడవు మఱి సర్వశక్తి
గీ॥ వార్తరక్షకుఁడవు జగదంతరాత్మ
వైననీకు నమస్కృతు లే నొనర్తు
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ ! సీతాసనాథ ! ౮౨

సీ॥ వెన్న దొంగిలినాడవే' యని నందుని
సతికోపపడ మది సణుగుకొనుచు
మిథ్యాగళద్బాష్పమిళితలోచనముల
సొంపుగ నటు నిటు చూచుకొనుచు
నరచేతఁ గల్గిన హైయంగవీనంబు
మాటిమాటికి నోట మాటికొనుచు
బర్హిపింఛము దలపై చలింపగ మాట
లాడక తనయంత నాడుకొనుచు
గీ॥ బాలకృష్ణుఁడ వైనట్టి ప్రాభవంబు
నేను సేవించు టెన్నఁడో నీరజాక్ష
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ! సీతాసనాథ ! ౮3

సీ॥ ఒకమాటు నీపాదయుగళంబు సేవింప
నుత్సాహ నయ్యెద నో రమేశ!
ఒకమాటు నీయర్చనకునైన సంతోష
పడకయుండెదనయ్యా! పరమపురుష!
ఒకమాటు నీకథల్ బ్రకటించుటకుఁ బ్రియ
త్నం బొనర్చుచునుందు నంబుజాక్ష!
యొకమాటు నీదుగుణోన్నతిఁ జింతించు
తలపు సేయక యుందు దానవారి
గీ॥ ఇట్లు చంచలమతితోడ నెల్లవేళ
నుల్ల మెటియంగ నేను చునుంటిఁ దండ్రి!
హతవిరాధ! విఘాతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౮౪

సీ॥ కనుగొనఁడే! నన్నుఁ గరుణాబ్ధి నను చుఁ గం
కణముఁ దాల్చినయట్టి ఘనగుణుండు
దయఁ జూడఁడే! నన్ను దాసపోషకుఁ డంచు
బ్రిథ వహించినయట్టి రఘుకులుండు
రక్షింపఁడే! నన్ను నక్షీణసత్త్వుండ
నని చాటుకొనునట్టి యచ్యుతుండు
చేపట్టఁడే! నన్నుఁ జేయిమోడ్చిన వారిఁ
జేయువిడనియట్టి శ్రీవిభుండు
గీ॥ ప్రోవఁడే నన్ను లోకాళిఁ బ్రోచువాఁ డ
టంచు ధైర్యంబుఁ గాంచితి నంబుజాక్ష!
హతవిరాధ! విఘాతసర్వాపరాధ!
తమ్మరఘురాధినాథ! సీతాసనాథ! ౮౫

సీ॥ ఆర్ద్రాపరాధి కాకాసురుఁ డెల్లలో
కంబుల నల్లాడఁ గావలేదె?
శత్రుసోదరునైన మైత్రితో వీక్షించి
సొంపుమీఱంగ రక్షింపలేదె?
గ్రద్దయ టంచనఁగాఁబోక యజ్జటా
యువున కక్షయలోక మొసఁగలేదె?
హీనజాతి యటంచు నెంచక గుహుని కౌఁ
గిలికి దేహం బిచ్చి మెలఁగలేదె?
గీ॥ నేను జేసినపాపమా? జానకీశ!
దర్శనం బైన నొసగంగఁ దలఁపులేదు?
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౮౬

సీ॥ నీలోన వసియింతు నీలోనఁ జరియింతు
నీలోన నిద్రింతు నీరజాక్ష!
నీలోన మేల్కొందు నీలోన విహరింతు
నీలోన భక్షింతు నిర్మలాత్మ!
నీలోనఁ గూర్చుందు నీలోన నిల్చుందు
నీలోనఁ బల్కుదు నిఖిలరూప!
నీలోనఁ జూతును నీలోన విందును
నీలోన వసనుదును నీలదేహ!
గీ॥ ఇట్టులయ్యును నిన్ను నే నెఱుఁగనైతి
నాదు పాపంబొ? నీమాయయో? దలంప
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౮౭

సీ॥ జలరాశిగతకలశంబున కంతర్బ
హిస్సుల జలము రహించుమాడ్కి.
చిదచిదీశ్వరతత్త్వసిద్ధాంత మైన నీ
వాసుదేవస్వరూపంబు నాకు
నంతర్బహిస్సులయందు వ్యాపించియు
న్నను గానలేనైతి మనుజసింహ!
తనసమీపంబునఁ దనరుచున్నను గప్ప
కమలంబు గ్రహియింపఁగలదె? తండ్రి!
గీ॥ ఎందుకును గొరమాలినహీనవర్త
నుండనై చెడిపోవుచునుందువాఁడ
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౫

సీ॥ తడవుసేయక వచ్చి దయసేయు మభయమ్ము
ఘోరపాపములెల్లఁ బాఱఁజిమ్ము
దాసుఁ డర్పించెడు దండముల్ గైకొమ్ము
చిల్లరదేవుళ్ళ నొల్లసుమ్ము
స్వామివి నీవు నీ స్వమ్ము నేను నిజమ్ము
బక్కబంటుగనైనఁ బట్టుకొమ్ము
జానకియొడిలోని చంటిబిడ్డను సుమ్ము
తమకు నేమాదునో తలఁచుకొమ్ము
గీ॥ బిడ్డఁడు భవాబ్ధిలోఁ బడి యుడ్డుగుడువఁ
బ్రోవవేనియు నీకీర్తి పోవుఁజుమ్ము
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౬

సీ॥ కరుణాబ్ధి వగుట నిక్కమయేని నా కొక్క
పర్యాయమైనఁ గన్పడఁగరాదె?
దీనరక్షకుఁడౌట యే నిజమేని యీ
దీనుని భవభీతిఁ దీర్పరాదె?
ఆశ్రితమందారుఁ డనుట నిశ్చయమేని
నాశ్రితు నొకసారి యరయరాదె?
దిక్కుమాలినవారి దిక్కౌట దృఢమేని
దిక్కుమాలిన నన్ను దిద్దరాదె?
గీ॥ పెట్టుకొంటివి పెదపెద్దబిరుదులన్ని
నన్ను బ్రోచితివేని యవన్ని నిజము
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౦

సీ॥ వారిఁ బ్రోచితి వంచు వీరిఁ గాచితి వంచు
నన్ బ్రోవ వేల? శ్రీనాథ! యంచు
బిడియపెట్టఁగ నేల? విశ్వవల్లభ! యింత
యర్హత లేదు లేదయ్య నాకు
నా పాపరాసులు నష్టమొందఁగ లేదు
దుష్టకామము లెల్లఁ ద్రుంగలేదు
నామనంబున నిన్ను నమ్మియుండఁగ లేదు
విశ్వాస మొకయింత వెలయలేదు
గీ॥ సర్వసముఁడవు సీ వేమిచలుపఁగలవు
నాయొనర్చినకర్మంబె నన్నుఁ జెఱిచె
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౫౧

సీ॥ నేఁద్రావుతీర్థంబు నీదుశ్రీపాదతీ
ర్థంబుగాఁ గరుణింపు మంబుజాక్ష!
నేఁ దినునన్నంబు నీకు నివేదిత
మైనదానిఁగఁ జేయు మా! రమేశ!
నేనాడుమాటలు నీకథాగానంబుఁ
గా నొనరింపు మఖండతేజ!
నే జేయుపనులెల్ల నీకుఁ గైంకర్యముల్
గాఁ గటాక్షింపు మర్కప్రకాశ!
గీ॥ నేను భావించుభావంబు నీదుతత్త్వ
భావముగ స్థిరపరుపవే! పరమపురుష!
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౯౨

సీ॥ నీమహత్త్వ మెఱుంగనేరని కుమతులు
నిన్నొకశూన్యుగా నెన్నుచుంద్రు
చంద్రుని జూడంగఁజాలనిజాత్యంధుఁ
డబ్జుండు లేఁడనియన్నమాత్ర
లేకయేపోవునే? లోక మామోదింప
దే? నీవు లేవని దేబె యొకఁడు
పల్కిన నీస్వరూపము లేకపోవునే?
నీదాసు లానందనిధులుగారె?
గీ॥ ఎవ్వరేమన్న నాకేల రవ్వ? నీదు
చరణసేవకుఁగా నన్ను సలుపుకొనుము
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౯౩

సీ॥ సర్వసర్వంసహా చక్రంబు నెల్లెడ
నింకుచు ధగ్గని మండిపడుచు.
జ్వాలాకరాళవిశాలార్చులను దిగ్ది
శాంతరములయందు నలమికొనుచు
మత్కృతపాపకర్మయుగాంత వహ్నులు
గ్రసియింపఁ బూని నన్ గ్రిందుకొనిన
నీసత్కృపాజలనిధి యేచి స్వీయ త
రంగహస్తములతోఁ బొంగిపొరలి
గీ॥ గండడఁచి వాని మాపఁగాఁగల దటంచు
నమ్మియుండెద నిత్యంబు నెమ్మనమున
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ ! ౯౮

సీ॥ శ్రీరమామానినీ చిత్తాంబురుహపూష!
పూషాన్వయాబ్ధిసంపూర్ణచంద్ర!
చంద్రార్ధమకుట సంజపిత తారకనామ!
నామనిర్జిత పాపనామరూప!
రూపరూపితదివ్యరూప వైభవయుక్త!
యుక్తధీవిభవసంసక్తభావ!
భావనాతీతసత్ప్రాభవాలంకార!
కారణకారణాఖండ తేజ!
గీ॥ తేజమొప్పార నాముందు దేవదేవ!
దేవితోఁగూడ నిలఁగదే దివ్యదేహ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౯౯

సీ॥ యోగంబునేర్వంగ యోగవిదుఁడఁగాను
దానధర్మముఁ జేయ ధనినిగాను
నీచరిత్రరచింప నేర్పు సత్కవిఁగాను
నుతియొనరింపఁ బండితుఁడగాను
తత్త్వంబుఁ జింతింపఁ దత్త్వవేత్తనుగాను
నిను భజింపఁగ భక్తినిధినిగాను
సర్వంబు నీ కిడ సత్ప్రసన్నుఁడఁ గాను
మనసు నీ కొసఁగ నిర్మలుఁడగాను
గీ॥ ఇట్టిహీనుని నన్ను జేపట్టి యహహా!
యమితవాత్సల్యమునఁ బ్రోవ నరసెదీవు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౯౬

సీ॥ నీవు రక్షకుఁడవు నేను రక్ష్యుఁడ నౌదు
తండ్రి వీ వేను బుత్రకుఁడ నౌదు
శేషివి నీవు నే శేషుఁడ నౌదును
స్వామివి నీవు నే స్వమ్ము నగుదు
ప్రభుఁడ వౌదువు నీవు బ్రజ నౌదునేను దే
వుఁడవు నీ వైన దాసుఁడను నేను
భర్తవు నీవు నీభార్యను నే నౌదు
నీవు జ్ఞేయుఁడ వైన నేను జ్ఞాత
గీ॥ నిట్టిసంబంధ మున్నది యిద్దఱకు నిఁ
కెట్లు న న్వీడఁ దలచెదో యిందిరేశ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౯౭

సీ॥ శ్రీకరుణాసింధు శ్రితదీనజనబంధు
తరుణాబ్జనేత్రు సౌందర్యగాత్రు
నీలమేఘశరీరు నిరుపమసంచారు
భక్తచిత్తనివాసు స్వర్ణవాసుఁ
గరధృతకోదండుఁ గాంచనమయకాండు
పాలితామరనాథుఁ బనితసాధు
శరణాగతత్రాణు జగదవనధురీణు
సద్ధర్మపక్షు విశాలవక్షుఁ
గీ॥ బ్రవిమలాననజితచంద్రు రామచంద్రు
నిన్ను సేవించుచుందు నా నెమ్మనమ్మున
హతవిరాధ ! విధూతసర్వాపరాధ !
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౯౮

సీ॥ అంభోజనేత్రున కంభోజనాభున
కంభోజపాదున కఘహరునకు
సకలభూతాత్మకు సకలాధిపతికిని
సకలరూపునకును శాంతినిధికి
దీనరక్షకునకు దీనబాంధవునకు
దీనపాక్షికునకు దివ్యమతికిఁ
బరమపూరుషునకుఁ బరమాత్మునకు ధర్మ
పరునకుఁ బరునకుఁ గరముభక్తి
గీ॥ నీకొనర్చెదఁ బ్రణతులు నీరజాప్త
కులజలధిసోమ! శ్రీరామ! కలితధామ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధనాథ! సీతాసనాథ! ౯౯

సీ॥ అప్రాకృతంబయి యలరు నీదివ్యమం
గళవిగ్రహముసేవ గలుగు టెపుడొ?
భక్తరక్షయె తమపనిగఁ బూనిన నీదు
కమనీయబాహువుల్ గాంచు టెపుడొ?
ఆశ్రితావళి కభయంబుఁ గూర్చెడినీదు
పాదసాన్నిధ్యంబుఁ బడయు టెపుడొ?
గరుడాదిపార్షద గణసేవితము నీదు
వైకుంఠనగరికి వచ్చు టెపుడొ?
గీ॥ యవ్యయానందవార్ధి నోలాడు టెప్పు
డెప్పు డెపుడిఁకఁ జెప్పవే యిందిరేశ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౦౦

సీ॥ ఆకాశ మనెడి మహాకళాభవనంబు
గల్పించి నక్షత్రగణము మణివి
తానంబుగాఁ గూర్చి ధారిణీస్థలి నాట్య
రంగం బొనర్చియు రాత్రిఁబవలుఁ
దెరలుగా నిర్మించి దీపంబులుగ సూర్య
చంద్రుల నియమించి సకలచేత
నాచేతనావళి నంతయుఁ బాత్రముల్
గాఁ జేసి లీలాప్రకర్ష మొప్ప
గీ॥ సూత్రధారివి నీవునై సొంపుఁజిల్క
నాటకం బాడుచుంటివి నళిననేత్ర!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౦౧

సీ॥ బ్రతికినన్నాళ్లు నా పావననామసం
స్మరణం బొనర్చిన, మానవులకుఁ
బ్రాణాత్యయస్థితి బ్రాప్తింగా రాయి
వలెఁ గొయ్యవలె స్మృతి, వదలియుంట
నంతిమస్మరణం బొకింత గల్గకయున్నఁ
గాని ఋణముఁగొన్నవానిఁబోలి
వైకుంఠనగరనివాసంబుఁ గల్పింతు
నిది నిజం బని చేతులెత్తి శపథ
గీ॥ మీ వొసర్చితి వింక నా కేమిభయము
నామమే వాగుచుండెదఁ బ్రేమతోడ
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౦౨

సీ॥ కాను బ్రాహ్మణుఁడను గాను క్షత్రియుఁడ వై
శ్యుండనుగాను శూద్రుండఁగాను
గాను వర్ణిని గృహాగతుఁడను నేఁ గాను
గాను వనస్థుఁడఁ గాను యతిని
సర్వజగజ్జాల,జన్మస్థితి ధ్వంస
కారణకారణాకారుఁడవయి
యాశ్రితమందారుఁ, డని కీర్తిఁ గాంచు నీ
దాసదాసులదాస దాసుఁడ నని
గీ॥ నిర్ణయముఁ జేసికొంటిని నీరజాక్ష!
దాస్యము స్వభావసత్తయై దనరు నాకు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౦౩

సీ॥ స్నానంబు లనుచు వేసార్లు గడ్గినఁగాని
దుర్గంధ మిసుమంత దొలఁగకుండు
ఆహార మనుచాంతరౌషధం బెంతెంత
వాడిన నంతంతఁ బ్రబలుచుండు
వస్త్రంబు లనుచుఁ బైపైనఁ గట్టుకునట్టి
గుడ్డకట్లకు లోనఁ గుళ్ళుచుండు
భూష లనుచుఁ గట్లు పోకుండఁ బెట్టిన
బరువుచే భారమై బరఁగుచుండు
గీ॥ నెత్తురుచీముల నెల్లెడ నిండియుండు
తను వను వ్రణంబు మాన్పవే? దనుజహరణ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౦౪

సీ॥ మాతృగర్భగుహాసమాన కారాగార
వాసదుఃఖములెల్లఁ బాసిపోవ
గత్తివాదరమీఁది గమనంబుపోలిక
దుర్గమంబైనట్టి త్రోవ లేల?
వాత్సల్యజలధివై వరకృపాశరధివై
దాశరథివియునై దనరునీకుఁ
జేతు లెత్తి నమస్సుఁ జేసెద నిదియె నా
కనుకూలతర మగునట్టి బాట
గీ॥ యన్నిట నకించనుండనై యున్ననాకు
నర్థిమందార! నీవె దిక్కై గతివెపుడు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౦౫

సీ॥ వైఖానసుఁడ నని వదరుచుండెదఁగాని
తన్మార్గ మెట్టిదో తలఁపనైతి
అర్చనఁజేయున ట్లభినయించెదఁగాని
యర్చావిధానంబు నరయనైతి
భక్తి సేయుఁ డటంచుఁ బల్కుచుండెదఁగాని
నే భక్తిసలుపంగ నేరనైతి
సత్ప్రపన్నునిరీతిఁ జరియింతు నేగాని
ప్రపదన భాగ్యంబుఁ బడయనైతి
గీ॥ ఇట్టి నిర్భాగ్యుఁ డిలమీఁద బుట్టఁబోఁడు
పుట్టియుండఁడు నిజముగఁ బుట్టలేఁడు
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మెరపురాధినాథ! సీతాసనాథ! ౧౦౬

సీ॥ మత్పితామహులచే మానితార్చనలను
గైకొన్న సద్గుణకలితుఁ డనుచు
మాతండ్రియొనరించు మహితకైంకర్యముల్
స్వీకరించెడు కృపాసింధు వనుచు
ననవరతము శరణాగతరక్షణ
బద్ధకంకణుఁ డైన ప్రభుఁడ వనుచు
మ్రొక్కినవారలఁ జక్కనివాత్సల్య
భావముచేఁ బ్రోచుదైవ మనుచు
గీ॥ మహిని సాష్టాంగముగను నమస్కరించి
నాఁడ నీచిత్త మిఁకమీఁద నళిననేత్ర!
హతవిరాధ! విధూత సర్వాపరాధ!
తమ్మెరపురాధినాథ! సీతాసనాథ! ౧౦౭

సీ॥ మంగళం అవనీకుమారికాహృచ్చోర!
మంగళం అమరసమ్మానితాంగ!
మంగళం ఆర్తసామజ రక్షణవిధాన!
మంగళం అఖిల సమ్మతసుధర్మ!
మంగళం ఆశ్రితామంద సౌఖ్యప్రద!
మంగళం అబ్జ సమాన నేత్ర!
మంగళం ఇదె సర్వమంగళాపతినుత!
మంగళం ఆగమ మహితచరిత!
గీ॥ మంగళము నీకు సత్కృపాపాంగసంగ!
మంగళము గోపదాసహృన్మందిరస్థ!
హతవిరాధ! విధూతసర్వాపరాధ!
తమ్మరపురాధినాథ! సీతాసనాథ! ౧౦౮

శ్లో॥ వైఖానసాన్వయోద్భూత
నృసింహాచార్యసూనునా
కృతస్తవః పరేశస్య
ప్రీయతాం జానకీపతిః.

శ్రీ శ్రీ శ్రీ